పట్టణవాసియగు ప్రతివాదిభయంకర వేంకటాచార్యులీమె భర్త. ఈమెకుఁ ద్రివేణియను నామము నిడుటకు హేతు వేమన—కావ్యమును నదితోఁ బోల్చుట ప్రాచీనకవిసంప్రదాయము.

కవిరాజసూరి 'రాఘవపాండవీయము'న

'శ్రీమద్రామాయణం గఙ్గా, భారతం సాగరో మహాన్
తత్సంయోజనకార్యజ్ఞః కవిరాజభగీరథః
మనోజ్ఞరామాయణభారతాఖ్య
భాగీరథీసాగరసంనిపాతే
స్నాతః ప్రసర్పన్త్వవగాహలీలా
మస్మిన్నఘచ్ఛేదిని కావ్యతీర్థే.'—1 స. ౪౧, ౪౪ ప.

అని రామాయణమును గంగానదితోఁ బోల్చియున్నాఁడు. ఇట్లే యనంతాచార్యకవి భారతభాగవతరామాయణములను మూఁడుకావ్యనదులను (గంగాయమునాసరస్వతులు ప్రయాగలో సంగమము నందినట్లు) 'యాదవరాఘవపాండవీయ'మను తనకావ్యమున సమ్మేళనము చేసెను. త్రివేణీసంగమమువలెఁ బవిత్రమగు తనకావ్యరచన పూర్తియగుటతోడనే యాతనికిఁ బుత్రికాలాభము కలిగెనఁట. అందువలన నీకన్యామణికిఁ ద్రివేణియను పేరొసఁగఁబడెనఁట. వివాహమునకుఁ బూర్వమే యీమెకవితాప్రజ్ఞ ప్రస్ఫుటమగుచుండెనఁట! జగద్విఖ్యాతకీర్తి నందిన సరోజినీదేవి కడుబాల్యముననే 8000 పాదములుగల యాంగ్ల కావ్యమును రచించెనని తెలిపినచో బాలకవయిత్రియగు త్రివేణిప్రజ్ఞ మనకంత విడ్డూరముగాఁ గన్పట్టదు. వివాహానంతరము భర్తృచరణారవిందముల సన్నిధి నీమె దర్శనములఁ బఠించెను. ఏకైకపుత్త్రుఁడు తనకన్నులయెదుట చనిపోవుటచేతను, భర్త యకాలమృతినందుటచేతను నీమె వైరాగ్యము చెంది సన్న్యాసినిగా జీవితశేషమును వెళ్లఁబుచ్చెను.

ఈమె రచించిన 'హారతిపంచకము'ను విని యానందించి యచ్చటి 'జిల్లాకలెక్టరు' ఆప్రాంతముల దొరకిన కొన్నివిగ్రహముల నీమెకొసఁగెను. ఈవిగ్రహములఁ బ్రతిష్ఠించుటకై యీమె యొకయాలయమును

నిర్మింపఁదలఁచి తిరువాన్కూరుసంస్థానమున కరిగెను. అక్కడ నీమె విశేషముగా సత్కరింపఁబడెను. మైసూరుసంస్థానప్రధానామాత్యులగు దివాన్ రంగాచార్యులువారికి నీమెయెడ విశేషగౌరవ ముండెడిది. వారి సమాదరణమువలననే యీమె యాలయనిర్మాణమును గొనసాగింపఁ గలిగెనఁట. ఈకవయిత్రి రచించిన గ్రంథము లనేకములు గలవు. ఎట్టి క్లిష్టసమస్యలనైన నాశువుగాఁ బూరించుటయందీమె కసదృశప్రజ్ఞ కలదు. సంస్కృతస్త్రీకవులలో నీమెరచించినన్ని కావ్యముల మఱెవ్వరును రచించియుండ లేదు. ఏకావ్యప్రసూనములచే నీమె సంస్కృతశారదారాధన మొనరించె నన—

అ. స్తోత్రాత్మకములగు కావ్యములు—

౧. లక్ష్మీసహస్రము.  ౨. రంగనాథసహస్రము.

ఈరెండును వేదాంతదేశికుల 'పాదుకాసహస్రము'ను, వేంకటాధ్వరి 'లక్ష్మీసహస్రము' నాదర్శముగాఁ గొని రచింపఁబడియుండును.

ఆ. రసగర్భములగు లఘుకావ్యములు, ((Lyrical poems.)

3. శుకసందేశము. †  ౪. భృంగసందేశము. †

ఇ. మహాకావ్యములు—

౫. రంగాభ్యుదయము.  ౬. సంపత్కుమారవిజయము.

ఈ. నాటకములు—

౭. రంగరాట్సముదయము.  ౮. తత్త్వముద్రాభద్రోదయము.

ఇందీకడపటిగ్రంథము కృష్ణమిశ్రుని 'ప్రబోధచంద్రోదయము' వలెను, వేదాంతదేశికుల 'సంకల్పసూర్యోదయము'వలెను నాధ్యాత్మికవిషయవిచారకమగు (Allegorical) రూపకము.

13. లక్ష్మీరాజ్ఞి—(క్రీ. 19 వ శతాబ్ది.)

ఈమె కడతనాడు, ఇకవలం, కొవిలోగం ('Kadathanadu, Ikavalam, Kovilogam') అను మలబారుదేశమునందలి పట్టణ

† ఈనామములతో నితరకవులు రచించిన సంస్కృతకావ్యములను గూర్చి మదీయ 'సంస్కృతదూతకావ్యచరిత్రము' (1937) ను జూచునది.

ములకు రాణి. క్రీ. 1890 ప్రాంతముల జీవించియుండెను. ఈమె 'సంతానగోపాలకావ్య' మను మూఁడు సర్గములకావ్యమును నిర్మించెను. భాగవతమునందలి దశమస్కంధమునను, హరివంశమునను గానవచ్చు సీకథ యిందలి యితివృత్తము—

ఒకానొక బ్రాహ్మణుని కొడుకులు పదిమందియు నొకరివెనుక నొకరు చనిపోవుట. అర్జునుఁడు కడపటిశిశువును రక్షించెదనని ప్రతిజ్ఞ చేసి, విఫలుఁడై యగ్నిప్రవేశము చేయనెంచుట. అప్పుడు శ్రీకృష్ణుఁడాతనిని వారించి, చనిపోయిన పదిమందిశిశువులను వైకుంఠమునుండి తీసికొనివచ్చి, బ్రాహ్మణు ననుగ్రహించి, యర్జునుని రక్షించుట.

ఈకావ్యమునఁ దృతీయసర్గము యమకప్రచురముగా నుండును.

14. జ్ఞానసుందరి: (క్రీ. 19-20 శతాబ్దములు.)

ఈమె వేశ్య, కుంభకోణనివాసిని. 1910 వ సంవత్సరప్రాంతములఁ గాలధర్మమునందెను. శ్రీవత్సగోత్రజులగు కుప్పుస్వామిశాస్త్రివర్యుల శిష్యురాలు. ప్రసిద్ధకవయిత్రి. ఈమెవక్తృత్వనైపుణిని, బద్యపఠనకౌశలమును, గానకళాప్రావీణ్యమును జెవులార విని, యామె నాట్యమును గన్నులారఁ గాంచి యమందానందము నందిన వృద్ధులనేకులు నేఁటికిని దాక్షిణాత్యమండలముల యందున్నట్లు తెలియుచున్నది. మధురానగరవాసియగు ఆర్. ఫిషర్ (R. Fisher) అను నుత్తమన్యాయవాది (బారిష్టర్) యీామెకుఁ బ్రధానాశ్రయుఁడఁట. ఈమె తనకవితాప్రావీణ్యమును మైసూరుసంస్థానమునఁ బ్రదర్శించి, యా మహారాజుచే 'కవిరత్న' బిరుదముచే సన్మానింపఁ బడెను. తా ననేకగ్రంథములను రచించిన ట్లామెయే చెప్పుకొనెను. కాని వీనిలో 'హాలాస్యచంపువు' †మాత్రము లభించినది. ఇందాఱు స్తబకములు గలవు. మధురయందలి మీనాక్షీసుందరేశుల వివాహాదికవృత్తాంత

† శ్రీ విద్యాముద్రాలయమున ముద్రితము, కుంభకోణము, 1906.

ము లిందు వర్ణింపఁబడెను. ఈమెకవిత ప్రాయికముగా ననుప్రాసప్రచు రముగా నుండును. మచ్చునకు రెండు పద్యములు:

౧. శ్లో. 'మధురీకృతగరళత్వాత్ మధురాభిఖ్యా తదాది సా నగరీ
నిజసీమస్థఫణిత్వాత్ విభాతి హాలాస్యనామత శ్చేహ.'

పై పద్యమున మధురకు హాలాస్యపురమనియు, మధురాపుర మనియు, నామములు గల్గుటకు హేతువు నిరూపింపఁబడెను.

౨. శ్లో. 'తస్యా లలాటలీనస్వాహాపతిరివ శాన్తసన్తాపః
రేజే కుఙ్కుమతిలకవ్యాజా న్నూనం బుధా హి కాలవిదః.'

ఈమెశయ్య యంతసరళముగా నుండదు గాని, యీామెకుఁగల గీర్వాణభాషాప్రౌఢి తత్కావ్యమునఁ బ్రస్ఫుటమగుచుండును.

15. శ్రీ దేవీ బాలరాజ్ఞి—

పేరునుబట్టి యీామె రాణియని యూహింపఁజనును. ఈమె దేశ కాలములు ప్రకృతము తెలియవచ్చుటలేదు. ఈకవయిత్రి శ్రీమద్భాగవ తమునందలి కథలను గైకొని 'చంపూభాగవత'మను కృతిని రచించెను. భాగవతమును సంస్కృతమునఁ జంపువుగ రచించిన కవీంద్రు లనేకులు గలరు. వారినామముల నిటఁ జేర్కొందును. ౧. అనంతనారాయణ పుత్త్రుఁడగు చిదంబరకవి. ౨. కుమారడిండిమునితనూజుఁడగు మూఁడవ రాజనాథుఁడు. 3. వెల్లాలకులోత్పన్నుఁడు నాంధ్రదేశీయుఁడు నగు అభి నవకాళిదాసకవి. ర. అభినవకాళిదాస-గోపాలశాస్త్రి. ౫. కొల్లూరి రాజశేఖరకవి, ఆంధ్రదేశస్థుఁడు. ౬. భారతచంపువును రచించిన అనంత భట్టు. ౭. రామభద్రకవి.

16. రాధాప్రియ—

ఉత్కలదేశమున (ఒరిస్సా) నొక మహారాజును, రఘునాథదేవ వర్మతనూజుఁడునగు విశ్వనాథదేవవర్మకుఁ బట్టపురాణి కవయిత్రి రాధా ప్రియ. భార్యాభర్త లిరువురును గలిసి 'రాధాగోవిందశరద్రాస'† మను

† 11 వ ప్రచురణము, ఉత్కలసాహిత్యముద్రాలయము, అత్ఘర్ (Athgurh, Orissa) 1917.

* 'రాధాప్రియ' వ్యాఖ్యతో ముద్రితము, ఉత్కలముద్రణాలయము, కలకత్తా, 1915.

పద్యకావ్యమును రచించిరి. ఇందు రాధాకృష్ణుల శరత్కాలరాసక్రీడలు వర్ణింపఁబడెను. రాజకవి యగు విశ్వనాథదేవవర్మ రుక్మిణీకృష్ణులవృత్తాంతమును 'రుక్మిణీపరిణయము'* (చరితము) అను నామముతో 11 సర్గముల మహాకావ్యమును రచించెను. పట్టమహిషి, విద్వత్కవయిత్రీమతల్లియునగు రాధాప్రియ భర్త రచించిన మహాకావ్యమునకు 'రాధాప్రియ'యను నొక ప్రౌఢవ్యాఖ్యను రచించెను. సంస్కృతభాషావాఙ్మయములలోఁ గఠోరవ్యవసాయ మొనరించిన నారీమణులే బహువిరళము. అందును గృతినిర్మాణదక్షులగు విదుషీమణు లింకను విరళము. అట్టియెడ భార్యాభర్త లిరువురును సంస్కృతమునఁ జక్కని పాండితిని బడసి కవితాపాండితీస్ఫోరకములగు గ్రంథముల రచించుట యద్భుతానందజనకముగా నున్నది. క్రీ. 17 వ శతాబ్దిలో వంగదేశమున మహాపండితుఁడగు కృష్ణనాథుఁడును, విదుషీమణియగు నాతని ధర్మపత్నియుఁ గలిసి 'ఆనందలతిక'యను చంపువును సంస్కృతమున రచించిరి. 18 వ శతాబ్దమున దక్షిణదేశమున విలసిల్లిన ఘనశ్యామవిద్వత్కవియు నాతని ధర్మపత్నులు విదుషీమణులునగు సుందరి, కమలయుఁ గలిసి రాజశేఖరుని 'విద్ధసాలభంజిక'కు వ్యాఖ్య రచించినట్లు ఘనశ్యాముని వాక్యమును బట్టి తెలియుచున్నది.

ఉపసంహృతి—

కాలాంతరమునఁ దక్షిణ గీర్వాణకవయిత్రులంగూర్చిన వ్యాసములు ప్రచురింపఁబడును. సంస్కృత కవయిత్రులంగూర్చి డాక్టర్ మాడభూషి కృష్ణమాచార్యులుగారు(యం.ఏ., యం ఎల్., పి హెచ్ డి) డాక్టర్. వి. రాఘవన్, డాక్టర్. యతీన్ద్రవిమలచౌధురి, (యం. ఏ., పి. హెచ్ డి.) మొదలగు విజ్ఞులు వ్రాసిన గ్రంథములు నాకెంతయు నుపయోగించినవి.

# ఉపోద్ఘాతము.



ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించిన ఛందోలక్షణగ్రంథములలో లక్షణసారసంగ్రహమును మిక్కిలి విలువగలగ్రంథమని చెప్పనగును. ఆంధ్రవాఙ్మయమున నింతకు మున్నే లాక్షణికులుగాని యాలంకారికులుగాని తమగ్రంథములలోఁ జెప్పని నాటకలక్షణముల నీకవి తెలిపియున్నాఁడు. మఱియు నేఁటిదనుక నాంధ్రకవిపండితలోకమునఁ బ్రచురప్రచారముననున్న యప్పకవీయమునకు నీగ్రంథము కొంతవఱకు మూలమని చెప్పినచో నీగ్రంథప్రాశస్త్యము తేటపడకమానదు. కావునఁ బరిషత్తువారీగ్రంథముఁ బ్రకటించి యాంధ్రకవిపండితులకే కాక, ఛందోలక్షణపరిణామము నెఱుఁగఁగోరు విమర్శకులకుఁగూడ దీనిని నుపాదేయముగ నొనరించినారు.

పరిషత్తున కీగ్రంథమునకు మాతృకయొక్కటియే చిక్కినది. ఇప్పటికి రమారమి పదునెనిమిదేండ్లక్రిందట, కీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావుపంతులవారీలక్షణసారసంగ్రహమును హరిభట్టురచితమగు నుత్తరనారసింహపురాణమును బరిషత్తునకై మైసూరు దొరతనమువారియొద్దఁ గొనియుండిరి. వీనిలో నుత్తరనారసింహపురాణ మిూవఱకే పరిషత్తువారిచేఁ బ్రకటింపఁబడినది. ప్రస్తుతము ప్రకటితమైన లక్షణసారసంగ్రహము పరిషత్పుస్తకభాండాగారమున 4141 వ సంఖ్యగలది. ఇం దిరువదియాఱు తాళపత్రములు గలవు. పత్రమునకుఁ దొమ్మిదిపంక్తులు. వ్రాఁత చక్కఁగ నున్నది. గ్రంథాంతమున "శ్రీమత్త్యాదిరీశాయనమః శ్రీసూర్యనారాయణాయనమః శ్రీశారదాంబాయైనమః శుభమస్తు శ్రీమత్త్యాదిరీనృసింహస్వామి సత్కృపను చిత్రకవి బుచ్చయాచార్యులతంముడు రామాచార్యులు వ్రాసిన లక్షణసారసంగ్రహమునకు శుభమస్తు. దుర్ముఖిసంవత్సర పుష్య శు ౩ల్లు" అనికలదు. లక్షణసారసంగ్రహమునేకాక యుత్తరనారసింహ

పురాణమును గూడ వ్రాసిన దీ రామాచార్యులే యని యాగ్రంథతాళ పత్రమాతృక చివరఁగల యీక్రిందిపద్యమువలనఁ దెలియుచున్నది.

"క. ధర శుభకీలకసంవ
త్సరమున శ్రావణమునందుఁ దగఁ జిత్రకవీ
శ్వరు బుచ్చయార్యు తమ్ముఁడు
వరమతి నరసింహు కథయు వ్రాసెను వేడ్కన్."

ఈగ్రంథముల వ్రాసినయాతఁడు కేవలవ్రాయసకాఁడు మాత్ర మే కాక, కవియై యున్నాఁడు. ఈతఁ డనంతపురమండలములోని ఖదిర నివాసుఁడై నట్లు పైవ్రాఁతవలన మనకుఁ దెలియవచ్చుచున్నది. ఈతఁడు రఘునందనవిలాసము లేక భోజభూపాలీయ మను పేర చంపూరామా యణమును దెలిఁగించియున్నాఁడు. పరిషత్పుస్తకభాండాగారమున నాగ్రం థము కలదు ఇందుల గద్యమున నీతనియింటిపేరు 'విక్కిరాల' అని కలదు. చిత్రకవి యాతని బిరుదనామము కావచ్చును; కావున లక్షణసారసంగ్ర హాకర్తయగు చిత్రకవి పెద్దనయు నీతఁడును నొక్కవంశమువారని యూ హింపఁజనదు చిత్రకవి పెద్దన యాజ్ఞవల్క్యుఁడు. చిత్రకవి రామాచా ర్యులు వైష్ణవుఁడు.

ఈ లక్షణసారసంగ్రహము తాళపత్రములు మిక్కిలి ప్రాఁతవియగు టచే నందు సూచింపఁబడిన దుర్ముఖిసంవత్సరము మొన్నటిదిగాక యా పైదాని పై దుర్ముఖి యగును. కావున నిది యిప్పటికి నూటయేఁబది సంవత్సరములపూర్వమే వ్రాయఁబడినదని చెప్పనొప్పును.

గ్రంథకర్త చిత్రకవిపెద్దన శుక్లయజుశ్శాఖీయుఁడు.* కాత్యాయన సూత్రుఁడు. భారద్వాజగోత్రుఁడు. ఈతనియింటిపేరు తొలుత పార్శం చాలవారు. పెద్దననాఁటినుండి వీరు చిత్రకవి వారైనారు. ఈవంశమునఁ బెద్దనతరువాతఁ బండితులు కవులును గూడ విలసిల్లిరి. వీరివంశవృక్షమిది.

---

* ఈతఁ డార్వేలనియోగిబ్రాహ్మణుఁడని వీరేశలింగకవికృతకవిజీవితములలో వ్రా యఁబడియున్నది. అది ప్రామాణికము. చూ. ద్వితీయభాగము. పుట. 293.

మంచిరాజు-(మాంచిరాజు) పార్శ్వంచాలవారు.

|

కాచన్న.

|

చెన్నన్న.

|

సర్వన్న-లక్ష్మమ్మ.

|

పెద్దన-(చిత్రకవివారు)

|

అనంతకవి-ఓబలాంబ.

|

వేంకటరమణకవి.

చిత్రకవి పెద్దన నల్లగట్ల యైలన్న దౌహిత్రుఁడు. కందాళయన్న గారి శిష్యుఁడు. శ్రీహనుమద్వరస్థిరసత్త్వవిత్వదక్షుఁడు. చిత్రకావ్యధనుఁడు. ఈతనికొడుకనంతకవి హరిశ్చంద్రనలోపాఖ్యానమునకుఁ డీకవ్రాసి, గండికోటదుర్గాధ్యక్షుఁడగు పెమ్మసాని చినతిమ్మానాయునిచే గౌరవింపఁబడినవాఁడు. ఈతఁడు హరిహరశ్లేషోదాహరణము, సకలజీవసంజీవని, వంశావళి, ఇందుమతీపరిణయము మున్నగు గ్రంథములఁ బెక్కింటిని రచియించియున్నాఁడు. మనుమఁడు వేంకటరమణకవి సాంబవిలాసమను విద్వత్కవికర్ణరసాయన సకలవర్ణనాపూర్ణ రామాయణము కుమారగురువిలాసమును రచియించియున్నాఁడు. అప్పకవి, సాంబవిలాసమునుండి నాలుగు పద్యముల నుదాహరించుటచేతనే యీతనిగ్రంథప్రాశస్త్యముఁ దెలిసికొనవచ్చును.

చిత్రకవిపెద్దన హనుమద్భక్తుఁడు. ఈతఁడు హనుమంతుని కంకితముగ నొకశతకము రచియించినాఁడని యీగ్రంథమువలనఁ దెలియుచున్నది. గాని, యది యిప్పుడు కానరాకున్నది.

పెద్దన నివాసస్థలమేదియో తెలియరాలేదు; కాని లక్షణసార సంగ్రహమున" నుతవెలలూరీపురీ హనూమంతునకున్ (1-17) వెల్లలూరి హనుమన్మూర్తి (3-1) అని వెలలూరు పేర్కొనుటచే నిదియే యాతని నివాసమని యూహించుట సముంజసము. వెలలూరు కడపజిల్లాలో గండికోటతాలూకాలోఁ గలదు.[1] తొలుత వీరియింటిపేరు, వీరు పార్వంచాలలో నుండుటవలన నేర్పడియుండును. పార్వంచాల కర్నూలుజిల్లాలో నందికొటుకూరునకు నెనిమిదిమైళ్లదూరములో నున్నది. కావున వీరు మొదట పార్వంచాలలోనుండి యావెనుక పెద్దననాఁటికి వెలలూరు చేరుకొనియుందురు. పెద్దనకొడు కనంతకవి కడపమండలమునఁగల గండికోటదుర్గాధ్యక్షునిచే గౌరవింపఁబడియుండుటచే వీరు కడపమండలములోని గండికోటసీమలోఁగల వెలలూరిలో నెలకొనియుండిరని చెప్పుటకు వీలగుచున్నది.

పెద్దన క్రీ. శ. 1550 ప్రాంతములనున్న లాక్షణికుఁడని యీక్రింది పద్యముచేత నిరూపింపవచ్చును.

ఉ. ప్రఖ్యాతవరప్రసాదకవితాఢ్యుని వేములవాడభీము, న
యుఖ్యాతభక్తివిస్ఫురదనంతు, ననంతు, కవిత్వలక్షణా
ధ్యక్షులఁ గాచిరాజు బసవార్యుని, భైరవు నూత్నదండి వా
గ్విలక్షణకర్త నేతయగు వెల్లఁకి తాతబుధేంద్రు నెన్నెదన్. 1-3

పైనిఁ బేర్కొనినవారలలో 'నూత్నదండి' కేతన యాంధ్ర భాషాభూషణమను వ్యాకరణము మాత్రమే రచియించియున్నను ఛందోలక్షణకారులతోపా టాతని పేర్కొనుట యాతనియందుఁగల ప్రత్యేకగౌరవముచేనని తెలియవలెను. ఈతఁడు క్రీ. శ. 1250 ప్రాంతమువాఁడు. పైవారిలోఁ గాలక్రమమున వెల్లంకి తాతంభట్టు కడపటివాఁడు. ఈతఁడు క్రీ. శ. 1500 ప్రాంతమువాఁడు. పెద్దనను క్రీ. శ. 1570 ప్రాంతమువాఁడగు లింగమకుంట తిమ్మన తనసులక్షణసారమున నిట్లు పేర్కొనినాఁడు.

1 Sewell List of Antiqnities Page 260
2 do. Vol. II Page 89

చ. అనుచు నదేమొకో మును రచించిన లక్షణసారసంగ్రహం
బెనయ వచించె జిత్రకవి పెద్దన లెస్సవు వోధు వోధ్రుశ
బ్దనయతఁ గానరో వినరొ లక్షను లెంతయు ధన్యులయ్యు వే
ల్గిన భ్రమఁ గాంతు రాత్మల నొకానొకచోటఁ బరాకుఁ గ్రమ్మఁగన్.[1]

కావునఁ జిత్రకవి పెద్దన క్రీ. శ. 1550 ప్రాంతమువాఁ డనుటకు సాధనము లనేకములు గలవు. పెద్దన కందాళయన్నగారి శిష్యుఁడు. ఈ కందాళయన్నగారు కంచాళ యప్పగారి తండ్రి. కంచాళయప్పగా రాకాలమున మహాప్రసిద్ధిఁజెందిన వైష్ణవాచార్యులు. పాండురంగమాహాత్మ్యకృతిపతి విరూరివేదాద్రికిని, చిత్రభారతకృతిపతి ఘౌనుములపల్లి పెద్దనామాత్యునకును వైజయంతీవిలాసకృతికర్త సారంగు తమ్మయకవికిని గురువులై విలసిల్లినవారు. ఈకృతికర్తలు కృతిభర్తలును, క్రీ. శ. 1550, 1560 ప్రాంతములలోనుండి యొకజడముడిలోనివారని చారిత్రకముగ నిరూపింపవచ్చును. మఱియు కందాళ యన్నగారిని చెప్పిన శాసనము క్రీ. శ. 1522 నాఁటిది తిరుపతిదేవస్థానమునఁ గలదు[2]. ఆతని శిష్యుఁడగు పెద్దన క్రీ. శ. 1550 ప్రాంతమువాఁడని నిశ్చయముగఁ జెప్ప వచ్చును.

ఈగ్రంథమున లక్షణములేగాని లక్ష్యములు లేవు. కాని లక్ష్య లక్షణములుగల గ్రంథ మీపెద్దనకవిది యీపేరితో నున్నదేమో యని యీక్రింది వ్రాఁతలవలన నూహింపనై యున్నది.

క్రీ.శ. 1909 వ సంవత్సరమున నన్నెచోడుని కుమారసంభవమును బ్రకటించి దాని పీఠికలో శ్రీ మానవల్లి రామకృష్ణకవిగా రిట్లు వ్రాసి యున్నారు.

"ఈకవి ప్రఖ్యాతుఁడు కాకపోవుటకుఁ గారణము. "బహుళ్లో సామాన్యమతిత్వేన తేషాం పరిగ్రహే లోకే, కామంగతా ప్రసిద్ధిం సామ్రా

1 ఈసందర్భమున చూడుఁడు లక్షణసారసంగ్రహము ద్వితీయాశ్వాసము, 8 పద్యము.

2 T. T. Devastanam. Archelogical Report Page 217.

స్యైకవయః అతఏవ" అని యూహింపవలయును. అయినను కుమార సంభవము లోని పద్యము 'ఆథర్వణచ్ఛందము పెద్దనలక్షణసారసంగ్రహము, కవిసంజీవని, రత్నాకరము, లక్షణశిరోమణి వీనిలో నుదాహరింపఁ బడినవి. (పుట 3.)

పెద్దన లక్షణసారసంగ్రహములో ౬ వ ఆశ్వాసమునుండియు రత్నాకరకర్త ౮ వ యాశ్వాసమునుండియుఁ బద్యము లుదాహరించి యున్నారు. ఇందఱుఁజూచిన కృతి నేఁటి కెట్లు క్రొత్తదగును?" (పుట ౪)

లక్షణసారసంగ్రహము పెద్దనదియని స్పష్టముగఁ గవిగారు తెలుపుచుండుటచేతను, వేఱొక పెద్దనరచియించినది మనకు నేఁటివఱకు లభ్యము కాకుండుటచేతను కుమారసంభవపీఠికయం దుదాహృతమైన దిపుడు పరిషత్తుప్రకటించిన గ్రంథమేయని యూహించుట సమంజసము గదా! అట్లయిన నిందు లక్షణము లేగాని లక్ష్యములు లేవు. కవిగా రుదాహరించినది వేఱొకలక్షణసారసంగ్రహమగునా యని సందేహించుచుండ నాసంవత్సరముననే తాము ప్రకటించిన క్రీడాభిరామపీఠికయం దీసందేహమును వారే తీర్చివైచిరి. "అప్పకవి శ్రీనాథుని వీథినాటకములోనివని యుదాహరించిన రెండుపద్యములను చిత్రకవిపెద్దన వల్లభరాయని వీథినాటకములోనివనియె యుదాహరించెను." పుట (ii) "చిత్రకవిపెద్దన, ముద్దరాజు రామన, శ్రీధరుఁడు, గణపవరపు వేంకటకవి, జగన్నాథుఁడు వీరందఱును వల్లభరాయని వీథినాటకములోనివనియె యుదాహరించి యున్నారు." పుట (v) సీతారామాచార్యులువారు శబ్దరత్నాకరమున ననేకదోషములు గూర్చిరి. అది యట్లుండ నప్పకవీయప్రతులలోఁ దక్కఁ దక్కిన లాక్షణికులు-అనఁగాఁ జిత్రకవిపెద్దన, రామన గణపవరపు వేంకట కవి కూచిమంచి తిమ్మకవి, కిళాంబి వేంకటాచార్యుఁడు లింగముగుంట తిమ్మకవి, కస్తూరి రంగకవి లక్షణదీపికాలక్షణసారగ్రంథకర్తలు "కుసుమం బెట్టిన" యనియే యుదాహరించిరి. చిత్రకవిపెద్దన "పస నెవ్వాఁడు". అను

టకు "అప్పసమెవ్వాఁడు" అనివ్రాసి యప్పసమనుటకు నాశ్చర్యమర్థమని యిది దేశ్యపదమని వ్రాసియున్నాఁడు (viii)

ఇంత కంఠోక్తిగ నొకచో లక్షణసారసంగ్రహగ్రంథమును వేఱొకచోఁ జిత్రకవిపెద్దనను బెక్కుతడవ లుదాహరించుటయేగాక చిత్రకవి పెద్దనగ్రంథమునఁగల పాఠభేదమునుఁగూడ శ్రీ కవిగారిచ్చియుండుటచే లక్ష్యములు గలిగియున్న చిత్రకవిపెద్దన లక్షణసారసంగ్రహము వారు చూచినట్లు నిర్వివాదముగా నేర్పడుచున్నది. అట్టిగ్రంథ మున్నచో దానిని యాంధ్రసాహిత్యపరిషత్తువారి కొసఁగి శ్రీ కవిగారు వాఙ్మయజిజ్ఞాసువులగు మాబోంట్లకు నుత్సాహము గలిగింతురుగాక !

లక్షణసారసంగ్రహమునకును అప్పకవీయమునకుఁగల సంబంధముఁగూర్చి వివరించినచో నప్పకవీయమునకు లక్షణసారసంగ్రహమెంత వఱకు మూలమైనదో తెలిసికొనవచ్చును.

1. కాలక్రమము ననుసరించి చూచినయెడల నప్పకవికంటె చిత్రకవి పెద్దన పూర్వుఁడుకావున నాతనిగ్రంథము నప్పకవి తొలుత గ్రంథావతారికయందుఁ బేర్కొనినాఁడు. పుట 12.

2. ద్వితీయాశ్వాసమున రేఫాక్షరసీసమాలికయందు "తాళ్లపాకాన్వయోదధిపూర్ణధవళదీధితి వేదతిరుమలదేశికుండు, మొదలైనవారలు మునుపు రచించినయవి యెల్లఁజాలవా యనఁగవలదు."

పైనిఁజెప్పిన 'మొదలైనవానిలోఁజిత్రకవిపెద్దన యొకఁడు. లక్షణసారసంగ్రహము తృతీయాశ్వాసమున రేఫఱకారనిర్ణయము గలదు. అందలి సీసగీతములలోనున్న పదములపట్టికనే యప్పకవి కొలఁదిమార్పులతోఁ దనగ్రంథమున గ్రహించియున్నాఁడు. ల. సా. సం. పుట 83-93 అప్పకవీయము. 69-83.

3. తృతీయాశ్వాసమున యతులనుగూర్చి వివరించుసందర్భమున.

కం. భీమన పదిచెప్పె ననం

తామాత్యుఁడు చేసె వెనుక యతు లిరువదినా

ల్గోమీఁదఁ గొందఱు కవి
గ్రామణు లిరువదియునేడు గావించి రొగిన్.

లక్షణసారసంగ్రహమున,

"యతులు గీతితారావళిగఁ జేతుఁ గృతుల లాక్షిణికులు మెచ్చ"
నని యిరువదియేడు గీతములలో నిరువదియేడు యతులనిచ్చియుండుటచే నప్పకవి సూచించిన లాక్షిణికుఁ డీతఁడే యగునుగదా! మఱియు రెండు పద్యములఁగూడ నుదాహరించియున్నాఁడు. చూ. దేశీయవిరతి- 19. ఎక్కటివడి. 26.

4. ఉదాహరణకావ్యలక్షణమునకు లక్ష్యముగా నప్పకవి శ్రీకృష్ణోదాహరణమును రచియించియున్నాఁడు. చిత్రకవిపెద్దన హనుమద్భక్తుఁడుగాన హనుమదుదాహరణము రచియించియున్నాఁడు. అందీక్రింది పద్యము లక్షణసారసంగ్రహములోనిది కొలఁదిమార్పులతో నప్పకవీయమున నున్నది.

చూడుఁడు. అప్పకవి:—

1. చ. మానవులార! రోగములు మానును లేములు లేవు సంపదల్
జానగు దుఃఖముల్దొలఁగు జాలిసఘంబులు మందబుద్ధులై
దీనత నొంద నేటికి నతిస్థిరభక్తినిఁ గొల్వుఁడీ పరా
ధీనులుగాక మీరువసుదేవకుమారకు*ను క్తికోసనె. అ. 4–314

పెద్దన:-

చ. మానును రోగము ల్వెతలుమానును లేములు మాను మీకు నో
మానవులార! యూరక భ్రమంగొన నేటికి నన్యదేవతా
ధీనులుగాక యెప్పుడు నతిస్థిరభక్తి దలిర్పఁ గొల్వుఁ డీ
మానినుతప్రసిద్ధమతిమంతుని మారుతిమంతుని న్మదిన్.

ల. సా. సం. పుట. 68.

---

*'కుమారుని' యని యుండఁదగును లేనిచో ద్వితీయావిభక్తి ప్రత్యయము లేదు. పద్యము ద్వితీయావిభక్తిలోనిది.

అప్పకవి:—

2. పులసిల నేల మానవులపుట్టును పావనమౌను నెప్పుడున్
గళవళమేల రోగము లకాలగతిం గడవట్టు నీతిబా
ధలును దరిద్రతావ్యథలు దవ్వులకే చను వాంఛితార్థముల్
గలుగు నమేయుచేతఁ గమలాధవుచే వటపత్రశాయిచేన్.

ఆ.-4-317.

పెద్దన:—

చ. భవహరమౌను పుట్టువును పావన మౌను దరిద్రతావ్యథా
నివహము లన్నియుం దొలఁగు నెమ్మది నెవ్వనిపుణ్యసత్కథల్
చెవులను విన్నవారలకు శీఘ్రమె చేకుఱు నట్టి యాజిసం
భవహతదాసుచేత హనుమత్ప్రభుచేత నభీప్సితార్థముల్.

అప్పకవి:—

చ. గృహోర్వ్యుక్తస ద్విధిఁ బెండ్లాడిన కృష్ణునందు నిలిచెన్ దీర్ఘప్రతాపోన్నతుల్.

పెద్దన:—

బృందారాహితపాదు నందు నిలిచెన్ శ్రీమత్ప్రతాపోన్నతుల్.

ఇట్లే యక్షగానలక్షణము మొదలగువానియందుఁ బదములు మార్పు లేక కానవచ్చుచున్నయవి. షట్ప్రత్యయవిధానము నప్పకవి విపులీకరించుటకుఁ బూర్వమే పెద్దన దీనిని సూక్ష్మముగఁ దన గ్రంథమునఁ జెప్పినాఁడు. చిత్రకవిత్వమునఁ గల్పితకల్పవల్లికాబంధమున కసమాన చాతుర్యమును జూపి పెద్దన 'చిత్రకవి' యని పేర్వడసినాఁడు. అప్పకవి రచియించిన కల్పితకల్పవల్లి పెద్దనవ్రాసినదానికి ప్రతిబింబ మనఁదగి యున్నది. పై విషయములు సావధానముగఁ బరిశీలించినచో నప్పకవి పెద్దనగ్రంథమును జాలవఱకు మూలముగ నుపయోగించినవాఁడని తెలియఁదగియున్నది.

లక్షణసారసంగ్రహ మప్పకవికాలమునాఁటికే మిక్కిలి ప్రసిద్ధిఁ జెందినట్లువంశపారంపర్యముగ ననంతకవియు, వేంకటరమణకవియు నిట్లు తమ గ్రంథములలోఁ జెప్పియున్నారు.

"లక్షణసారసంగ్రహం బొనరించి యుద్యత్కీర్తిఁ బ్రఖ్యాతుఁడగు
పెద్దనార్యసుతుఁడ

కుమారుఁడు అనంతకవి హరిశ్చంద్రనళోపాఖ్యావ్యాఖ్యాది

"సర్వలక్షణసారసంగ్రహం బొనరించి తనరె మాతాత పెద్దనకవీం
ద్రుఁడు

మనుమఁడు వేంకటరమణకవి సాంబవిలాసకృత్యాది.

మఱియు గద్యయందు 'లక్షణసారసంగ్రహరచనావిశారద చిత్రకవిపెద్దనార్యపౌత్ర' అని వ్రాసికొనినాఁడు.

ఇట్లు వంశీయులేగాక, కొలూరి యాంజనేయకవి తన సుకవికర్ణామృతమునను, పొత్తపి వేంకటరమణకవి తన లక్షణశిరోమణియందును నీగ్రంథము నుదాహరించియున్నారు* వీరప్పకవికి సమకాలికులు కావున యప్పకవినాఁటికే లక్షణసారసంగ్రహమును జాల ప్రఖ్యాతమై నుండె ననియు, నప్పకవిగ్రంథమునకు మూలమైయుండుననియు నూహించుట సమంజసమైయున్నది.

పెద్దన లక్షణసారసంగ్రహమున నాటకలక్షణముచు దశరూపకము ననుసరించినట్లు వ్రాసినను నుపరూపకముల వివరణముపట్టున సాహిత్యదర్పణము ననుసరించినట్లు కానఁబడుచున్నది. ఇందలివిషయములను విపులముగా వ్రాయవలెననిన నీక్రిందిరీతిని సూచించునట్లు దశరూపకభేదంబులవలె నుపరూపకములకుఁ జేయవలయును. అప్పుడు విద్యార్థులకుఁగూడ నీవిషయము కరతలామలకముగాఁ గలదు.

---

*మా. పరిషత్పుస్తక భాండాగారము. పుటలు 4-11. ఆ. సా. పరిషత్పత్రిక (పరిమాధి మార్గశిర- ఫాల్గున) సం. పు. 28. సంచిక 5, 6.

## దశరూపక భేదంబులు

| రూపకభేదము. | ఇతివృత్తము. | నాయకుఁడు. | రసము. |
|---|---|---|---|
| 1. నాటకము | ప్రఖ్యాతము | ధీరోదాత్తుఁడు | శృంగారవీరరసములు |
| 2. ప్రకరణము | ఉత్పాద్యము | ధీరశాంతుఁడు | శృంగారము |
| 3. భాణము | | ధూర్తవిటనాయకుఁడు | శృంగారవీరములసూచనమాత్రము |
| 4. ప్రహసనము | కల్ప్యము | పాషండుఁడు | హాస్యరసము |
| 5. డిమము | ప్రఖ్యాతము | ధీరోద్ధతుఁడు దేవగంధర్వరాక్షసపిశాచాదులు)(16 | రౌద్రము |
| 6. వ్యా గము | | ధీరోద్ధతుఁడు | వీరము |
| 7. సమవాకారము | కల్పితవ | దేవాసురనాయకులు (12 | ,, |
| 8. వీథి | ,, | ధీరోద్ధతనాయకుఁడు | శృంగారరసము |
| 9. అంకము | ప్రఖ్యాతము | ప్రాకృతజననాయకుఁ | కరుణరసము |
| 10. ఈహామృగము | మిశ్రము | ధీరోదాత్తుఁడు | శృంగారరసము |

నాటకలక్షణమే తమగ్రంథములఁ దడవని ంధ్రలాక్షిణికులలో నాటకలక్షణము ర చి ంధ్రభాషావాఙ్మయమున కుపకృతిగావించినగౌరవము పెద్దనదేయని చెప్పనొప్పును.

పెద్దన హనుమద్భక్తుఁడుగావున హనుమంతునిఁగూర్చి యాతఁడు వ్రాసిన యుదాహరణమున నాతనికవిత యెంతయు హృద్యమైయున్నది. సర్వలక్షణసారసంగ్రహమగు నీగ్రంథము నాంధ్రమహాజను లాదరింతురుగాత !

నిడుదవోలు వేంకటరావు బి. ఏ.

---

నరసభూపాలీయకర్త మూర్తికవి యీతనిసమకాలికుఁడు. పెద్దన తనగ్రంథమున నాటకలక్షణముల నిచ్చియుండుటచే నరసభూపాలీయమున నాటకలక్షణము చేర్పఁబడి యుండలేదేమోయను నూహ పొడముచున్నది. ఈవిషయ మింకను బరిశోధింపఁదగి యున్నది.

శ్రీరస్తు.

# లక్షణసారసంగ్రహము.

## విషయసూచిక.

---



## ప్రథమాశ్వాసము.

## ద్వితీయాశ్వాసము.

# తృతీయాశ్వాసము.

క. ఏగణముఁ గదిసె నగణం
బాగణము సమస్తమంగళావాప్తంబై
రాగిల్లు వినుము పరుసము
తోఁ గదిసిన పసిఁడివన్నె దూఁకొనుమాన్కిన్.

ఆంధ్రకవిగజాంకుశే:—

ఆ. వె. పరుసవేదితోడఁ గ(?)దిసిన లోహంబు
జాతరూపమైన చందమునను
సారమైన నగణసంగతిఁ దనకీడు
...మానిద ...గణముమందిద గును.

ఇట్లు తాఁ జెప్పఁబూనిన విషయమునంతను సంస్కృతభాషయందే చెప్పినాఁడు. ఉపపత్తినిఁ దెలుపు నాంధ్రచ్ఛందోగ్రంథములుకూడఁ బేర్కొనినాఁడు. ఇం దీతఁడు పేర్కొనిన లక్షణగ్రంథములు- 1 అలంకారసంగ్రహము. 2 సాహిత్యచూడామణి. 3 సాహిత్యరత్నాకరము. 4 సాహిత్యచంద్రోదయము. 5 కవికంఠపాశము. 6 చమత్కారచంద్రిక. 7 కవిరాజగజాంకుశము. 8. శ్రీధరచ్ఛందము. 9 గోకర్ణచ్ఛందము. 10 అథర్వణచ్ఛందము మున్నగునవి.

గ్రంథారంభము:—

ప్రణమ్య విద్వజ్జనపారిజాతమ్
కవీంద్రవిప్రార్చితపాదపంకజమ్
విభుం ప్రభుం విశ్వసృజం మహేశమ్
స వక్ష్యతే లక్షణదీపికే యమ్.

అస్య గద్యప్రబంధానామ్ ఛందోలక్షణ నియామక స్యాదౌ తావ త్ప్రకారః పఠ్యతే.

గ్రంథాంతభాగము:—

ఏషా లక్షణదీపికా విజయతే విద్వజ్జనానందినీ
ఛందోలంకరణాద్యనేకవివిధగ్రంథప్రయోగాన్వితా

గర్వాఖర్వకుతర్కకర్కశకవిగ్రీవాస్పదా సంశ్రిత
వ్యాళీ సత్కవిరాజకల్పలతికా కల్పాంతరస్థాయినీ.

ఇతి వితరణవిజితవినుతపారిజాత పోతనామాత్యసహజాత చాతుర్యగుణాభిరామ శ్రీమదయ్యలుమంత్రిశేఖరగర్భరత్నాకరరాకాసుధాకర గౌరనార్యవిరచితాయాం లక్షణదీపికాయాం మాతృకాపూజావిధానం నామ పంచమః పరిచ్ఛేదః.

ఇం దుదాహరించిన విషయములనే వివరించుచు నింతకంటె నధికముగఁ జాటుప్రబంధలక్షణములఁ దెలుపునట్టి "గౌరన-లక్షణదీపిక" యను పేర వెలయు శ్లోకసంస్కృతలక్షణగ్రంథము 2585 సంఖ్యగలది కలదు. ఈలక్షణదీపికల రెండింటిని రచియించిన గౌరన లొక్కరేనా ? లేక భిన్నులా ? 'నవనాథచరిత్రము' మున్నగు ద్విపదకావ్యములను రచించిన గౌరనకు నీలక్షణగ్రంథమును రచించిన గౌరనకు సంబంధ మేమేని గలదా ? అను నీవిషయము సంశయగ్రస్తముగ నున్నది. విమర్శకు లీయుభయవిధగ్రంథములఁ బరిశోధించి నిర్ణయించెదరుగాక !

10. లక్షణగ్రంథము—గ్రం॥ సం॥ 3488.

ఇందు 48 పత్రములు కలవు. ఆద్యంతభాగములు లేవు. గ్రంథమును రచియించినకవిపేరు కానరాదు. వ్రాంత బాగుగనే యున్నది. గ్రంథపాతము లేదు. సంధిలక్షణముతోఁ బ్రారంభమై విభక్తులు యతిప్రాసములు మున్నగు కొన్నివిషయము లిందుఁ జర్చింపఁబడినవి. కొన్నితావుల లక్షణములు వానివివరణములు సంస్కృతభాషలో రచింపఁబడినవి. లక్ష్యములు ప్రాచీనప్రబంధములనుండి విపులముగఁ గైకొనఁబడినవి.

గ్రంథారంభము:—

అథసంధిః:—

ఉతోఽచి పరరూపం—ఉతః=ఉకారమునకు అచ్చుపరముగాఁగా బరరూపము వచ్చును. తాను+అన్న, ఇతి స్థితే నకారాత్పరమైన

ఉకారమునకుఁ బరమం దకారము వచ్చును. తానన్నమాట—తాను + ఇచ్చె తానిచ్చె. తాను + ఈఁదె=తానీఁదె.

గ్రంథాంతభాగము:—వృత్తసంఖ్యాప్రత్యయము.

క. సమవృత్తప్రస్తార
క్రమ మిదియును యుక్తి మొదలుగా నెన్నవ ఛం
దము వలయు నన్ని గురువులు
కమలాప్రియ యడ్డచాలుగా నిడి పిదపన్.

పిమ్మటఁ బ్రస్తారపటమును నింకఁ నిరూపింపఁబడినది.

## 11 కావ్యచింతామణి-గ్రం. సం. 4532.

ఈప్రతి 45 పత్రములు కలది. వ్రాఁత యున్నంతదనుక బాగుగ నే యున్నది. తొలుతఁ బందొమ్మిది పత్రములలో వెల్లంకి తాతమభట్ట ప్రణీతంబైన కావ్యచింతామణి కలదు. ఇదియు నసంపూర్ణమే. 391 సంఖ్యగల ప్రతిలో నీగ్రంథమే 'కవిచింతామణి' యను "కావ్యానుశాసనము" అనుపేర వ్యవహరింపఁబడినది. రెండిట లక్ష్యలక్షణస్వరూప మొక్కటియే. అచ్చటచ్చటఁ గొలఁదిగ మార్పులుగలవు.

గ్రంథారంభము:—

శా. శ్రీభూతేశ సుతాగ్రజున్ గణపతిన్ సీతాంశుమౌళిన్, సమ
స్తాభీష్టప్రదు, నిర్వికల్పు, జగదాధారున్ ... ... ... ...
... ... ... ... ... ... ... ... ... ... ... ... ... త్రిపదన్మ్యాద్యుక్
సాభిప్రాయము చేసుకున్ గొలిచెదన్ సువ్యక్తపూజాపరున్.

సీ. శుచి యజ్ఞమార్గభాసుకిముకామణి
యబ్ధీమణిహూనుఁ డనఘబుద్ధి
పావన వశిత శాలావతగోత్రుఁడ
హా... మరామార్యతమ్ముఁ

షష్ఠభాషాప్రక్రియాలబ్ధవర్ణుండు
సన్నుతసాహిత్య చక్రవర్తి
అనవద్య సర్వవిద్యాపారదృశ్వుఁడు
విద్వజ్జన వ్రాతవిశ్రుతుండు

గీ. సకల హారదంతరాళవిశ్రాంత విశద
కార్తికిక చంద్రికాయతకాంతికీర్తి
హరిహయాస్యుఁడు వాణీవిహారవసతి
తామసోల్లంఘి వెల్లంకి తాతసుకవి.

క. చేకొని పదరూపంబులు
ప్రాకృతలంకేశ్వరాది బహుశాస్త్రగతిన్
లోకమునఁ దెలియఁ జెప్పఁగఁ
జేకుఱు నాచేతఁ దగు నశేషము లైనన్

తరువాతి పదునేడు పత్రములలోఁ గేతనవిరచితమగు నాంధ్రభాషాభూషణమును, బిమ్మటి తొమ్మిది పత్రములలో నర్థములతోఁగూడిన చాటువులును గలవు.

## 12 లక్షణగ్రంథము-గ్రం॥సం॥ 391.

ఇదియొక సంకలితలక్షణగ్రంథము. ఇందు 130 పత్రములు గలవు. వ్రాఁత బాగుగనేయున్నది. 60 పత్రముల వఱకు శైథిల్యత లేదుగాని, తరువాతి పత్రములు మధ్యభాగమునఁ గ్రిమిదష్టములైనవి. ఇందలి గ్రంథముల వివరము:—

తొలుత నిరువదిమూఁడు పత్రములు-ఆంధ్రనామసంగ్రహము-పిమ్మటఁ బదునేను పత్రములు-ఆంధ్రభాషాభూషణము-తరువాత నిరువదిరెండు పత్రములు-అనంతునిఛందస్సు-ఆవెనుకఁ బదునొకండు పత్రములు దేశితెనుఁగు మఱుఁగులు- అనంతరము తొమ్మిది పత్రములు నానార్థనిఘంటువు- పదపడి మూఁడున్నర పత్రములు పెద్దపూడి భద్రన రేఫఱ

కారనిర్ణయము- తుదిని వెల్లంకి తాతంభట్ట విరచితంబైన "కవిచింతామణి" యను కావ్యానుశాసనము నిరువదియేడు పత్రములలో నిమిడియున్నది. ఇందలి తొలిపత్రము కానరాదు.

గ్రంథారంభము:-

క. క్తవతు క్వ గ్రేయనులకు (?)
నవిరత మేకాక్ష రాద్వ్యయములకు మఱియున్
వివరింప తిజ న్తములకు
భువిలో ముఖ్యప్రయోగములు లేవు హరీ !

ఇందలి ప్రకరణముల 'నధికారములు' గఁ బేర్కొనినాఁడు. ఆయాయధికారముల తుదిని వ్రాసిన గద్యములను బట్టి యీకవికిఁ గల ప్రతిభావిశేషమును, ఇందు నిరూపించిన లక్ష్యలక్షణస్వరూపమును దెలియవచ్చుచున్నవి.

(1) ఇది వినుత విద్యావిశారద వెల్లంకి తాతంభట్ట ప్రణీతంబైన కావ్యచింతామణి కావ్యానుశాసనంబున దోషాధికారము-

(2) ఇది అష్టభాషావతార వెల్లంకి తాతంభట్ట ప్రణీతంబైన కవిచింతామణియను కావ్యానుశాసనంబునందు భాషాలక్షణాధికారము-

(3) ఇది సారసాహిత్యచతుర ............ ప్రాసాధికారము-

(3) ఇది ........................... వర్ణనీయాధికారము.

ఇందు, పావులూరి మల్లన గణితము భాస్కరరామాయణము, అనంతుని ఛందము, మున్నగు గ్రంథములనుండి లక్ష్యలక్షణములు కైకొనఁ

క. పద దండి కామనాధిక
విదితాలంకారశాస్త్రవిశదములగు న
ర్వాది దోషంబులలో కిం
చిదకంబులు (?) మాని కొన్ని చెప్పితిఁ దెలియన్.

ఇది వినుతవిద్యావిశారద వెల్లంకి తాతంభట్ట ప్రణీతంబైన కవిచింతామణి కావ్యానుశాసనంబున దోషాధికారము.

## 13. లక్షణగ్రంథము గ్రం. సం. 580

ఇది యొక సంకలితలక్షణగ్రంథము. ఇందు 37 ముప్పదియేడు పత్రములుగలవు. ఉన్నంతదనుక గ్రంథపాతము లేదు. వ్రాఁత తిన్ననిది. తప్పులు మెండు. తొలుత నిరువదిరెండు పత్రములవఱకు ఆంధ్రనామ సంగ్రహము గలదు. తరువాతి పదిపత్రములలో 'లక్షణము' అను పేర వృత్తములుయతులును లక్ష్యలక్షణములతోఁ గూర్పఁబడినవి. కవిపేరు తెలియరాదు. లక్షణములు కవిజనాశ్రయము మున్నగువానిలోనివి. ఇందుఁ జేర్చినయతులు.

1. స్వరయతి, 2. వర్గయతి, 3. అఖండయతి. 4. ప్రాదియతి, 5. బిందుయతి, 6. ప్లుతయతి, 7. ప్రయుక్తాక్షరయతి, 8. యుక్తాక్షరయతి, 9. పోలికయతి, 10. సరసయతి.

గ్రంథారంభము:—

సర్వగురు ర్మగణం ఆదిగురు ర్భగణం మధ్యగురు ర్జగణం

గ్రంథాంతము:—

సగణలయ క్రియాంక సమచక్రమునం దొకటాదిగాఁగ త
ద్విగుణము లడ్డనిడి (?) సదలింపుచు కామగృహాంకసంఖ్యలో
ఁగితసువాతి యిట్లు వ్రెతు లొడ్డిఱ(?)ధోంకమునం సమాధికం
జగత్రతిమానుచుం కడమ బొల్చు ప్రతుల్ దొరలింపచల్వగున్.

"ఈఛందస్సు సంజ్ఞాలక్షణము వృత్తలక్షణము మాతృకలోనున్నప్రకారం గాను సంపూర్ణముగా దుర్భపెద్దిభొట్లు వ్రాసెను" అని కలదు.

తుది మూఁడుపత్రములలో కవిజనాశ్రయము కొలఁదిగఁ గలదు.

## 14 కవిసర్పగారుడము. 4950

ఇందు 39 పత్రములు గలవు. వ్రాతఁ చక్కనిది. తప్పులు లేవు. ఇదికాచన బసవనచే రచింపఁబడినది. అసంపూర్ణము వ్రాయసగాని పేరు లేదు. లక్షణముల స్వయముగఁ గూర్చి, లక్ష్యముల ననేకప్రబంధముల నుండి సేకరించినాఁడు.

గ్రంథారంభము:—

శా. శ్రీదేవేంద్రుని శాంతు దంతురవిభారించోళి పాణింధమా
ప్రాశాలిస్థమణీ నిలింపమకుట ప్రాసాదఖేలత్పదుం
బేశాకల్పుని మల్లికార్జునిని సంప్రీతిం గృతిం జేసి వి
ద్యాశక్తిం గవిసర్పగారుడము సందర్భింతుఁ బూర్వస్థితిన్.

కావున జగదుపకారంబుగా శారదావిలాసంబును, లక్షణసారంబును, లక్షణదీపికయును, సాహిత్యచూడామణియును, కవికంఠపాశంబును, కవిగజాంకుశంబును, ఉక్తాదిఛందంబుల సంధించి, బంధవిచిత్రసంధాన బంధన గ్రంథం బనవద్యంబుగా సకలలక్షణంబు లీక్షించి, అక్షయాక్షుద్రవై లక్షణ్యంబులగు యక్షరంబులకు వివక్షించెద.

గ్రంథాంతభాగము:—అందు లయవిభాతి యను వృత్తము.

ననననసనంబులును నననసగంబులును
నెసఁగఁ గృతిపాదముల రసికముగఁ జెప్పన్
కుసుమశరవత్సుభగ యసదృశగుణానుయుత
వెస లయవిభాతి యని రసమసుకవీంద్రుల్.

## 15. కవిసర్పగారుడము. 3575

ఇది 28 కొండపల్లి పీచుకాగితపుఁబత్రములతోఁ గూడినది. వ్రాఁత కన్నడమోడీలో నున్నది. తప్పు లంతగ లేవు. పత్రము లచ్చట

చ్చుటఁ గ్రిమిదష్టములైనను గ్రంథపాతము మాత్రములేదు. 4950 ప్రతిలోని విషయము, నిందలివిషయము నొక్కటియే. అచ్చుటచ్చుటఁ గొలఁది మార్పులు గలవు. గ్రంథారంభమునందలి తొలిపద్యము లిందు లేవు. గ్రంథారంభము:—

కావున జగదుపకారంబుగా శారదాతిలకంబును. వాతూలంబును అక్షయాక్షుద్రవైలక్షణ్యం బమరవీక్షించి, గణంబులకు నుత్పత్తియు, ఫలంబులును, యోనులును, నక్షత్రంబులును, వర్ణంబులును, గ్రహంబులును, కులంబులును, రసంబులును, గణంబులును, అధిదేవతలును, గ్రంథాంతరంబుల ప్రయోగవిధంబు, సహజప్రయోగలక్షణంబు, తత్తద్వ్యాఖ్యానంబులు, ఫలంబులు, కులంబులు, గ్రహంబులు వర్ణంబులును, నధిదేవతలు, భూతబీజ ప్రకారంబులు, రాసులు నక్షత్రంబులు యోనులు, తత్తద్వ్యాఖ్యానంబులు, గ్రంథాంతర సమ్మతులు, ప్రయోగలక్షణంబులు, మిత్రాదిశోధనక్రమంబులు, వేధావేధలక్షణంబులు, ప్రయోగవేళలు, స్వరంబులు, గతులు, దిక్కులు, గంధపుష్పభూషణోపహారంబులు, పూజాక్రమంబులు, ప్రస్తారముఖమప్రత్యయంబులు, నుదాహరణభేదంబులు, శృంగారాది రసభావంబులు, మదనసాధనంబు లెఱింగించెద.

కాచన బసవన యీగ్రంథమును రచియించినాఁడని తెలుపు నాశ్వాసాంతగద్యము.

ఇతి శ్రీమన్నందవరకులకలశ పారావారాత్రేయసగోత్ర పవిత్ర సుజనవిధేయ కుకవికార్ద్రివేయమైనతేయ కాచన బసవన నామధేయ ప్రోక్త శ్రీ గిరిమల్లికార్జుననామధేయాంకితంబైన కవిసర్పగారుడంబున గణాక్షరఫలంబన్నది ప్రథమాశ్వాసము.

యతుల యుదాహరణములతో నీప్రతి ముగిసిపోయినది. ప్రతి తుదిని సముద్రాల కృష్ణమయ్య వ్రాసినదిగాఁ దెలియుచున్నది.

డింగితజ్ఞుఁడు రాముఁ డంగజాతహరాంఘ్రి
సంగమానసుని బతంగతేజు
మంగళాచారు విహంగమరాజతు
రంగసన్నిభుఁ గౌశికుం గనుఁగొని

గీ. గంగసత్కథ నీవు చెప్పంగ వింటి
కొంగున ముడుచు బంగారుభంగి నొప్ప
తుంగసుకృతంబు కాంక్ష దీరంగఁ గలిగె
సంగతానంద ! నిన్ను మెచ్చంగ వశమె ? ౫౬౭

చ. అన విని సంతసించుచుఁ గుశాన్వయుఁ డజ్జనపాలనందనుం
గనుఁగొని పల్కె బాహుబలఖండితదానవవీర రాఘవా!
వనజహితుండు గ్రుంకెఁ గనవచ్చెఁ దమిస్రము దిక్కులందు నిం
క ననుజుఁ డీవునున్ సుఖముగా శయనింపుఁడు నాదుసన్నిధిన్. ౫౬౮

క. అని పల్కి రామలక్ష్మణు
లనురాగముతోడ మునిజనాఢ్యుసమీపం
బునఁ దృణవిరచితశయ్యల
ననువుగ నిద్రింపఁగా నిశాంతం బగుడున్ ౫౬౯

గీ అపుడు పౌలోమి తనపట్టి యాడుకొనఁగఁ
దలఁచి తత్తల్పమున కూర్ధ్వతలమునందు
వ్రేలఁగట్టిన బలుమగఱాలబంతి
విధము దోఁపంగ దివిఁ దోఁచె వేఁగుజుక్క. ౫౭౦

గీ. జక్కవలవిందు పొడము ప్రాగ్దిక్కునందు
మ్రొక్కుఁడని తెల్పుచుండె నాఁ గుక్కుటములు
ఱెక్క లల్లార్చి కంఠముల్ నిక్కఁజేసి
కుక్కురో కో యటంచును గూయసాఁగె. ౫౭౧

వ. ఆసమయంబున రామలక్ష్మణులు మేల్కాంచి సూర్యోదయావసరం
బునం బ్రాతరాహ్నికకృత్యంబుల నిర్వర్తించి సకలమునిజనంబులకు

నమస్కరించి, కౌశికసమేతులై యచ్చోటు నిర్గమించి, పరిపూరిత భక్తమనోరథయగు భాగీరథి నుత్తరించి, యవ్వలితీరంబునఁ బ్రవేశించి, యాసమీపంబునందు కరితురగాందోళికాదివిరాజితంబును, ధనధాన్యసంపన్నంబును, నిరంతరజనసంకులంబును, మణిగణఖచితగోపురంబును, నగు విశాలాపురంబుం గాంచి, తద్విలాసంబునకు హర్షించి, విశ్వామిత్రుంజూచి, యిన్నగరం బెవ్వరి దేలింగింపు డనిన, రామచంద్రునకుఁ గౌశికుం డిట్లనియె. ౧౭౨

సీ. విను రామ ! తొల్లింటి వృత్తాంత మంతయు
 వినిపింతు నెమ్మది వేడు కలర
బలవంతులగు నిర్జరులు దితినందనుల్
 దమలోన నమృతంబు ద్రావఁ గోరి
వరమందరాద్రిఁ గవ్వంబుఁ గావించియు
 సురగేంద్రుఁ ద్రాడుగా గిరికిఁ బన్ని
క్షీరసాగరము దుర్వారులై దరువంగ
 నబ్ధిఘోషములు బ్రహ్మాండ మెల్ల
గీ. నిండె; నంతట దుగ్ధవార్నిధిని దివ్య
తనుఁడు దివ్యకమండలుధారి యగుచుఁ
బుట్టె ధన్వంతరి యనంగఁ బురుషవరుఁడు
దిశలఁ దనమేనికాంతులు దీటుకొనఁగ. ౧౭౩

వ. మఱియును. ౧౭౪

క. అచ్చుగ నమరులు దనుజులు
మచ్చిక లొదవంగ కడలి మథియింపంగా
నచ్చర లఱువదికోటులు
చెచ్చెర జనియించి రందు సితకమలాక్షా ! ౧౭౫

వ. మఱియు నప్పాలవెల్లియందు 'వారుణి' యను సురయును, 'ఉచ్చైశ్శ్రవం' బను హయంబును, 'ఐరావతం' బను గజంబును, కమలాదేవి

యు, కౌస్తుభరత్నంబును, కల్పవృక్షంబు నాదిగా ననేకంబు లుద్భ
వించినవెనుక నమృతం బొదవిన నయ్యమృతంబునకై దేవదానవులు
కలహించుచుండ నాసమయంబున విష్ణుండు జగన్మోహినియై, తన
మాయాప్రభావంబున దైత్యసమూహంబు మోహితంబు గావించి,
యమృతం బపహరించె; నది కారణంబుగా సురాసురుల కధికసంగ్రా
మంబు వర్తించె. నందు నసురుల వధించి విజయంబు చేకొని, సురస
హితుండై యింద్రుండు సురలోకంబున కరిగి లోకత్రయం బేలుచు
సుఖంబుండె; ననంతరంబ. ౧౭౬

క. అమృతనిమిత్తంబున న
య్యమరులకును రక్కసులకు నధికము గాఁగన్
సమరం బగుటయు దానవ
విమతులచే సుతులు చెగుట విని దితి మదిలోన్. ౧౭౭

సీ. తద్దయు శోకించి తనవిభుఁ గశ్యప
మునివరుఁ గనుఁగొని వినతిఁ జేసి
యనఘాత్మ ! సురలు మదాత్మజాతుల నెల్లఁ
దునుమాడి రాజిలో దోర్బలమున
ససుతనై యాత్మలో నలమట నందుచు
నుంటిఁ గావున నాకు నురుబలుండు
పురుహూతహరుఁడగు పుత్రుండు గలుగంగఁ
గరుణింపవలయు శీఘ్రమున దేవ !

గీ. యనుడుఁ దనసతి దితిఁ గాంచి మునివరుండు
భూరికారుణ్యపీయూషపూరితాత్ముఁ
డగుచుఁ గోమలి నీవు నన్నడిగి నట్లు
సేమ మొనరింతు నెమ్మదిఁ జింత విడుము. ౧౭౮

క. తరుణీ వేవత్సరములు
నిరుపమశౌర్యమునఁ దపము నీ వొనరింపన్

గురుతరబలుఁడు పురందర
హరుఁడగు తనయుండు నీకు నరుదుగఁ బుట్టున్. ౧౭౯

క. అని యంగమార్జనముఁ గై
కొనఁజేసి మునీంద్రుఁ డేఁగె గురుతరతప మే
పునఁ జేయఁగఁ గశ్యపుఁ డిటు
చన దితి కడునిష్ఠఁ దపము సలుపఁగఁ దొడఁగెన్. ౧౮౦

గీ. దితి తపముసేయుచుండుటఁ దెలిసి యాత్మ
వడలి సురలోకనాయకుం డరుగుదెంచి
ఫలజలాదు లొసంగుచుఁ బరమభక్తి
సవతితల్లికి శుశ్రూష సలుపుచుండె. ౧౮౧

వ. ఇట్లు సంక్రందనుండు సవిత్రికి సవినయంబుగా సపర్య లాచరించుచుండఁ బదివత్సరంబులు గొఱంతగా సహస్రవర్షంబులు నిండుటయు, నొక్కనాఁ డపరాహ్ణసమయంబున శిరోభాగంబు చరణప్రదేశంబుగా విస్రస్తకేశపాశయై దితి నిద్రించుచుండిన, ౧౮౨

గీ. అశుచియైయుండె దితి యిది యవసరంబ
టంచు దితి బొజ్జలోఁ బ్రవేశించి యాత్మ
కరకలితవజ్రధారఁ దద్గర్భ మేడు
ఖండములు గాఁగఁ గోసె నాఖండలుండు. ౧౮౩

గీ. కోయునెడ బాధ కోర్వక కుక్షి నున్న
శిశువు రోదింపఁగా సునాశీరుఁ డుల్ల
మలర 'మారుద' 'మారుద' యంచుఁ గోయ
మిట్టిపడి లేచి యా సాధ్వి యిట్టు లనియె. ౧౮౪

క. తెగటార్పకు దెగటార్పకు
తగ వెడలు మటన్న దేవతానాయకుఁ డొ
ప్పుగ వెడలి వినయమొప్పఁగ
నగపడి కేల్మోగిచి యిట్టు లనియెన్ భక్తిన్. ౧౮౫

శా. తల్లీ! నీ వశుచిత్వ మొప్పఁ గడు నిద్రం జెందియుండంగ నే
నుల్లంబం దిది వేళయంచు దళనోద్యోగంబు గావించితిన్,
తల్లోక్యం బొనరింపకున్న సుతు డుద్యల్లీల నీకబ్బువాఁ
డుల్లాసంబున నన్నుఁ ద్రుంచు ననిలో నుగ్రక్రియారంభుఁడై. ౧౭౫

క. నీ వెఱుఁగవె యీ చందము
దేవీ నీసుతుఁడు నన్నుఁ దెగటార్పంగా
భావుకమె నీకు మదిలో
భావింపుము నేను నీదుపట్టిని గానే. ౧౭౬

ఆ. వె. కాన నీవు నన్ను గరుణఁ బ్రోవు మటంచు
వేల్పుఱేఁడు తన్ను వేఁడుచుండ
నమరవరుఁ డసాధ్యుఁడని దితి శపియింప
లేక మిగుల నుమ్మలించి పలికె. ౧౭౭

క. తనయుండ వినుము నాచే
సిన దుష్కృత మిట్టి కీడుచేసెను నీ వే
మొనరించెదు నీపైఁ గిని
యను నినుఁ బ్రార్థింతు నాస్పృహను గూర్పు మిఁకన్. ౧౭౮

సీ. సుత ! భవత్కులిశఖండితగర్భసప్తఖం
డంబులు సతమారుతంబు లగుచు
గగనవాతస్కంధగాములు గానిమ్ము
మఱియును విను మాద్యమారుతంబు
నలువలోకమున రెండవమారుతము సురా
ధీశలోకమునఁ దృతీయమారు
తము గగనంబునం దక్కిన నలుమారు
తములు నల్దిక్కుల నమరమూర్తు
లగుచు నీయాజ్ఞ మెలఁగని మ్మనఘ నీవు
కినుక 'మారుద' 'మారుద' యనుట మాను

తాహ్వయంబులఁ దనరని మ్మనిన వినుచు
నింద్రుఁ డాదైత్యమాతతో నిట్టు లనియె. గీ ౧౦

వ. దేవి నీమనోరథంబు సిద్ధించు, నీకొమరులు సప్తమారుతంబులై దేవ మూర్తులై సకలలోకంబులయందు సుఖంబునం బ్రవర్తించుచుందురు సంతోషింపు మని పలికి, యప్పాకశాసనుండు నాకంబునకరిగె, నిట్లు పుత్రాశంజేసి తపోనియతయైన దితికి శతమఖుండు పరిచర్య నొనర్చుచుండిన దేశం బిదియని చెప్పి కౌశికుం డిట్లనియె. గీ ౧౧

క. జనవల్లభ ! యిక్ష్వాకుని
తనయుండు విశాలుఁ డనఁగఁదగు రా జేలుఁగా
ఘనమగు నీపట్టణ మా
తనిపేర విశాల యనఁగఁ దగు నిప్పురియుఁగా. గీ ౧౨

గీ. ఆవిశాలు విశాలాన్వయంబునందు
'సుమతి'యను రాజు జన్మించి సొంపు మిగుల
నీవిశాలాపురం బిప్పు డేలుచుండె
జనపతులు సంతతముఁ దన్ను సన్నుతింప. గీ ౧౩

ఉ. చాపకళాధురీణ నవసారసలోచన రామ ! యీవిశా
లాపురి నేఁటిరాత్రి మది లాలస మానఁగఁ బవ్వళించుచున్
రేపు విదేహకుం జని విరించిసమున్ జనకక్షితీశ్వరున్
బాపవిహీనుఁ జూత మని పల్కుచుఁ గౌశికుఁ డున్న యత్తఱిన్.

ఆ. వె. మునివరేణ్యురాక వినుచు నాసుమతియు
కరము భక్తి నెదురుగాఁగ నేఁగి
మ్రొక్కి యర్ఘ్యపాద్యము లొసంగి మన్నించి
కుశల మడిగి కరుణఁ గోరి మ్రోల. గీ ౧౫

వ. ఉన్నసమయంబున నమ్మునివరుం డజ్జనవరున కిట్లనియె. గీ ౧౬

క. సుమతిగలవాఁడ వగుటను
సుమతి యనెడు పేరు నీకు శోభిలుచుండెన్

సుమతిజనవినుతకీర్తి వ
సుమతిన్ నినుఁబోలు నట్టి సుగుణులు గలరే. ౯౭

చ. అని వినయంబునం బలికి, యాతనితమ్ముని రాజు వేడ్క దీ
వనలిడి రామలక్ష్మణుల వార్తలు దెల్పఁగ నన్నరేంద్రుఁడున్
మనమునఁ బొంగి రాఘవుల మన్ననఁజేయఁగ సత్వరంబుగాఁ
జని, తగ విశ్రమించి రట సంయమియున్ నరనాథసూనులున్ ౯౮

క. ఆరాతిరి చన మఱునాఁ
డా రాఘవు లమ్మునీంద్రుఁ డాత్మల ముద మే
పారఁగఁ బ్రభాతకృత్యము
లారూఢి నొనర్చి మిథిల కరిగిరి సరగన్. ౯౯

వ. అప్పు డప్పురోపకంఠంబున నొప్పుచున్న యొక్కయారామంబుఁ గని యారామచంద్రుండు కౌశికమునీంద్రుం గాంచి, మునివరా! జనరహితంబయ్యు నతిరమణీయంబగు నీయాశ్రమం బెవ్వరి దెఱింగింపవే యని యడిగిన విశ్వామిత్రుం డిట్లనియె. ౧౦౦

ఉ. భూతలనాథ! రామ! విను పుణ్యచరిత్రుఁడు భూరితేజుఁ డా
గౌతముఁడన్ తపోధనుఁడు కాంత యహల్యయుఁ దానుఁ గూడి, ము
న్నాతతనిష్ఠ సన్మునిజనాళులు మెచ్చ ననేకవర్షముల్
ప్రీతిఁ దపంబు సేయుచును బెంపువహించుచు నుండ నొక్కెడన్.

గీ. అదను వేచి సురేంద్రుఁ డహల్యఁ గవయ
నాత్మఁ దలఁచుచు మదనశరాళిదళిత
హృదయుఁ డగుచును గౌతమాకృతి వహించి
పర్ణశాలఁ బ్రవేశించి పడతిఁ జూచి. ౧౦౨

క. కలకల నవ్వుచు నీతోఁ
గలియఁగ నేతెంచినాఁడఁ గామిని యనినన్
కలవాణి యతనిఁ గనుఁగొని
బలభేదనుఁ డని యెఱింగి పలికెం బ్రేమన్. ౧౦౩

ఆ. వె. అమరవిభుఁడ వౌదు వసఘాత్మ నిక్కంబు
తెలుపు నా కటంచుఁ జెలువ పలుక
నమరవిభుఁడఁ గానె యతివ నీ కిప్పుడు
దాఁప నేల యని యతండుఁ బలికె. ౬౦౪

వ. అని పరస్పరంబును మనోరథంబులు తేటపడం జెప్పుకొనుచున్న
యెడ నమరవల్లభుం డహల్య కిట్లనియె. ౬౦౫

క. శాతోదరి! నీకొఱకై
గౌతమ వేషంబు పూని కదిసితి నాకున్
జేతోమోదం బొదవఁగ
నీతఱి రతికేలిఁ దేల్చు మిందునిభాస్యా! ౬౦౬

గి. గద్దరి మదనుం డిటు మన
కిద్దఱకుం ఘటనచేసె నిఁక నీమదిలో
తద్దయుఁ గూరిమి పెనఁగొన
ముద్దియ్యవె నాకుఁ దబిసి ముద్దియ వేగన్. ౬౦౭

సీ. కంజాక్షి! నీచన్నుఁగవ నంటఁ జాలని
కరముల కేమి సౌఖ్యంబు గల్గు
చంద్రాస్య! నీమేనిసౌరు గాంచనియట్టి
కన్నుల కేమి సౌఖ్యంబు గల్గు
పల్లవపాణి! నీ పల్కులు వినని క
ర్ణంబుల కేమి సౌఖ్యంబు గల్గు
కలకంఠి! నీతోడఁ గలిసి యుండనిశరీ
రంబున కేమి సౌఖ్యంబు గల్గు
గీ. నాతి! నీకూర్మి నాకు నీనాఁటి కబ్బెఁ
బడఁతి! నేఁడు త్రిలోకాధిపత్య మబ్బ
నాఁటికంటెను మిగుల నానంద మయ్యె
నెలఁత! నాభాగ్యగరిమ వర్ణింపఁ దరమె.

గీ. తరుణి నామాట లెల్ల చిత్తమునఁ బూని
నమ్మెదో నమ్మవో సంశయమ్ము గాని
నిన్ను శచికంటె నధికగా నెన్నుచుండఁ
దెలుపనేటికి నామది దేవుఁ డెఱుఁగు. ౬౦౯

క. ఎవ్వరు గనకుండఁగ నిటు
పువ్వారుంబోఁడి మనకుఁ బొందు ఘటిల్లెన్
పువ్వులకోరివజీరుని
చివ్వకు నీమెచ్చుఁ గొందు శీతాంశుముఖి ! ౬౧౦

గీ. సకలశాస్త్రార్థవిజ్ఞానచతురుఁ డనుచు
వట్టిమాటలు జగతిలోఁ బుట్టెఁ గాని
స్నానసంధ్యాద్యనుష్ఠాన సరణి యట్ల
కామశాస్త్రార్థ మెఱుఁగునే గౌతముండు. ౬౧౧
గౌతమునకును నీకు సంఘటన మగుట
వనిత ! నీప్రాయ మిన్నాళ్లు వ్యర్థమయ్యె;
నడవిఁ గాచిన చంద్రికయట్లు ధరణిఁ
బాడు గృహమున నున్న దీపంబువోలె. ౬౧౨

గీ. జగతిలోపల నెంత యసాధ్యమైన
తపముచేతను సాధింపఁ దగును; గాన
భామ ! నీ వొనరించు తపంబువలన
నింద్ర భోగంబు సమకూరె నింత నిజము. ౬౧౩

క. చిలుకల కొలికీ ! మరువిరి
ములుకులగతి నీ కటాక్షములు నామెదపైఁ
బలుమఱు నాటిన తాళం
గలనా ? నను నేలు సురతకలనాసక్తిన్. ౬౧౪

మ. లలనా ! నీవయిఁ గూర్మిమెంపున మహోల్లాసంబు దీపింపముౕ
గలనైన న్నినుఁ గూడి చొక్క మదిలోఁ గాక్షింతు నక్లైన ను

త్పలపత్రాక్షి ! మదంబకంబులను రెప్పల్ మూయ వేనాఁడు; మా
యలదైవంబు గృపావిహీనుఁడయి నన్నస్వప్నునిం జేయుటన్. ౬౧౫

వ. అనుచు నేకాంతంబుగా శచీకాంతుండు కంతుశరకంపితస్వాంతుండై,
తనయభిప్రాయంబంతయు నెఱింగించి వేఁడిన, మునికాంతయగు నహ
ల్య నిరంతరసంతోష భరితాంతఃకరణయై, యామంత్రైన వింత నొం
దక మంతనంబున నతని కిట్లనియె. ౬౧౬

గీ. అమరవల్లభ ! విను త్రిలోకాధిపతివి
నీకృపావీక్షణమునకు నేఁడు తగిన
దాననైతిని; నేఁజేయు తపము పండె;
నామకోటిక కొనసాఁగె నాకనిలయ ! ౬౧౭

క. వనితలు ననుఁ గనుచు మహా
మునిమగువా ! యనుచుఁ బిల్వ మోదము గైకొం
దును; శ్రీమంతుని కలికీ !
యనుకట్టులు దోఁచు నప్పదార్థమువలనన్. ౬౧౮

క. ఆ యర్థము నిక్కముగా
నాయెడ వర్తించె నిపుడు నాకేశ ! త్రిలో
కాయతమానితరాజ్య
శ్రీయుక్తుఁడవైన నీకుఁ జెలినై యుంటన్. ౬౧౯

క. నారూపము నాజవ్వన
మారయ మునిపత్నినగుట యర్హామె చెపుమా
నీరజగర్భుని వ్రాఁతలు
ధారుణిలో నేరికైనఁ దప్పునె యకటా !

గీ. పదము లొత్తుచుఁ దనయొద్దఁ బవ్వళింపఁ
బవ్వ మిది, నేఁడు వ్రతమని పలుకుఁ గాని
మౌనివరుఁ డొక్క రేయైనఁ గాని మదన
కదనసుఖ మంద నేరఁడు గదిసి నన్ను. ౬౨౧

క. సతి కెనయగు పతిచే నగు
రతి దలఁపఁగ మిగుల సుఖకరం బగుచుండున్
జతగాని వానిచే నగు
రతి దుఃఖకరంబగు న్సురవ్రజనాథా ! ౬౨౨

క. గౌతమముని రూపముచే
నాతో సరియగునె దేవనాయక ! విను మ
చ్చాతుర్యవచనరచనల
కాతతసంతోష మంద నర్హుఁడె చెప్పుమా. ౬౨3

శా. ఆనందంబున నావిభుం గనను పాకారీ ! కృపాకారి నీ
గాన న్నేఁడు దురంతచింత లుడిగెన్ గారాము నాకబ్బె నీ
చాన న్నన్ను వరించు కోర్కులలరన్ సంభోగసంధాయివై
నానాబంధ విచిత్రవైఖరుల నానందాబ్ధిలోఁ దేల్చుచున్. ౬౨౪

క. శతమన్యుఁడు పతి యని సం
తతఖేదముఁ జెందుచుండ దైవము నాకున్
శతమన్యుని నినుఁ గూరిచి
యతిమోద మొనర్చె నిప్పుఁ డతిచిత్రముగన్. ౬౨౫

గీ. ఇంద్రుఁడ నటంట కైతవం బింతె కాని
దర్పకుఁడ వంచుఁ దోఁచు సౌందర్య మరయ
శంబరారివి సుమనః కదంబకృతివి
హరిహయుఁడ వౌట సందియం బగునె నాకు. ౬౨౬

చ మనమున నిన్నుఁ గోరి, కడు మక్కువతోడుత నున్న నాపయిన్
ఘనకృప నీవు వచ్చితివి గావున నీకిఁక విన్నవించెదన్
జనవున జాగుసేయక, వెసన్ మదనాశుగపీడ వీడఁగా
నను రతికేళిఁ దేల్చు సురనాయక! మాటలు వేయు నేటికిన్. ౬౨౭

క. అని పల్క నహల్యం గని
వినయంబునఁ బలికె దేవ విభుఁ డోవనితా !

విను నీ వాడిన మాటలు
పనివడి నాచెవులకును బంధువుఁజేసెన్. ౬౨౮

క. తరుణీమణి ! సరసత గల
సరసీరుహనేత్రచెల్మి సంగత మైనన్
బురుషునకు నింతకంటెను
బరమాహ్లాదకరమైన భాగ్యము గలదే. ౬౨౯

వ. అను సమయంబున, ౬౩౦

క. ఇరువురకు నింత సేపిటు
గురుధృతు లొప్పునె యటంచు గొబ్బునఁ గోపో
ద్ధురుఁడై మదనుఁ డహల్యా
సురపతులన్ దూలనేసె సుమశరములచేన్. ౬౩౧

వ. అంత నయ్యహల్యాకాంతా శచీకాంతులు పరస్పరసంజనిత ప్రేమాతిరేక సంభ్రాంతస్వాంతులై గాఢాలింగనంబు లొనర్చుచు, మధురాధరసుధాపానంబు లాచరించుచు, నఖదంతక్షతంబులు సేయుచు,లపనకపోలచుంబనంబులు గావించుచు సంభోగసమయోచిత మృదుమధురవచనంబు లాడికొనుచు, రతిరహస్యాది మదనశాస్త్రోక్తప్రకారాంగీకృత బహువిధవిచిత్ర బంధబంధుర సురతసంజాతానంద విస్మృతశరీరు లగుచునుండి, కొంతసేపునకుఁ దెలివిగొంది, మందహాసభాసుర వదనారవిందులై, కందర్పప్రభావంబునకు విస్మితు లగుచున్నయెడ, రదప్రభావిజితకుందయు, కచనిచయవిజితమిళిందయు, మందగమన పరిహాసితగజబృందయు, పురందర సమాగమకృతానందయు నగు మునిసుందరి సంక్రందనున కిట్లనియె. ౬౩౨

చ. అనిశముఁ బెంపుమీఱుచు మదాత్మనఁ గీల్కొను పంచబాణవే
దన సడలించితీవు కడుధన్యత నొందితి; నింకఁ బాకశా
సన ! నినుఁ బాసి యొక్కనిమిషంబుననన్ నిలు పోపఁజాల నై
నను మదిసాధ్వసం బొకటి నాటుకొ యున్నది; యేమి సేయుదున్.

వ. అది యెట్టిదంటేని? యెఱింగించెద నాకర్ణింపుము. ౬౩౪

ఉ. చూతశరాకృతీ! బలనిషూదన! నీవు నేను గూడి యి
ట్లాతతలీల ముచ్చటల నాడుచునుండిన నింతలోపలన్
గౌతమమౌని వచ్చిన నకారణశాపము లిచ్చు నీకు నా
కీతఱి నట్లుగాన దివి కేఁగుము చెచ్చెర నీవు నావుడున్. ౬౩౫

ఉ. కామిని! నాకు నీపయినఁ గల్గిన కూరిమి నిన్ను వీడఁగా
నామదిఁ దోఁపదైన నొకనాఁటికిఁ దీఱునె నాదుమోహ; మో
కోమలి! నీవు దెల్పినటు గొబ్బున నేఁగెద నింటి కాముని
గ్రామణి రాకమున్న ననుఁగన్న సహించునె మౌని శాంతుఁడై ౬౩౬

ఆ. వె. అతివ! యినుము నంటు నగ్నికి సమ్మెట
పెట్లు దగులునట్లు పేర్మితోడ
నన్నుఁ గదిసియున్న నిన్ను శిక్షించుఁ బో
గౌతముండు కోపకలితుఁ డగుచు ౬౩౭

ఆ. వె. కాన సత్వరంబుగా నింటి కేఁగెద
మగువ నన్ను నెపుడు మఱువకుండు
ముచితమైన వేళ నొగి వత్తు నిటకుమ
త్ప్రాణతుల్య! ఘనకృపా! యహల్య! ౬౩౮

వ. అని పల్కి, పునఃపునరాలింగనంబు గావించుచు, ప్రణయమధుర
వచనంబు లాడుచుఁ గొంత తడ వుండి, యతిసాహసంబునఁ దదను
రాగరజ్జువుం దెంపుకొని, నిలింపపతి యహల్యాకాంతను వీడ్కొని
యుటజంబు వెలువడి వచ్చునెడ, నతనిముందట గౌతమమునీంద్రుఁ
డెదు రేఁగుటయు, మహనీయ తేజోవిరాజితుండును, సురనదీకృతా
వగాహనుండును, కరకలితగంగోదక కనత్కమండలుండును, పింగ
జటాభారసంగతుండును, పరమతపోధనుండును నగు నమ్మౌని
సింహునిం గాంచి, సురకుంజరుండు భయకంపితాత్ముండై యున్నస
మయంబున, ౬౩౯

క. కన్నుల నిప్పులు రాలఁగఁ
గ్రన్నన సురపతిని జూచి, గౌతముఁ డనియెన్
మన్నింపఁగ నర్హుండవె
మున్నువలెన్ నీవు సేయు మూర్ఖత దలఁపన్. ౬౪౦

గీ. తప్పుఁ జేసినాఁడ విప్పుడు గావున
లోక మెఱుఁగ శిక్ష నీకుఁ జేతు
ముష్కరుండ వగుట ముష్కహీనుండవై
గర్వ ముడిగి యుండు పర్వతారి ! ౬౪౧

గీ. అని శపింప, నింద్రు నండముల్ ధరణిపైఁ
దునిసి రాలె; నంత మునివరుండు
బాయఁదఱిఁగియున్న జాయను గన్గొని,
యధికకోపుఁ డగుచు ననియె నిట్లు ౬౪౨

ఉ. కోఁకదీఱ నిప్డు సురకుంజరుఁ గూడి తవాచ్యమౌ దురా
చార మొనర్చి తీవు మునిజాయలలోపల నిన్నుఁబోలు వా
రేరి ? వచింపుమీ ? సుగుణహీనవు నిన్న ననేమి గల్గు; నో
నీరజనేత్ర సూరిజననిందితవై తివి; ధాత్రి నయ్యయో ! ౬౪౩

ఉ. తోయజగంధి ! నీ వొసఁగు తోయము లంటఁగరాదు; గూడి నీ
తో యజనాదికృత్యములు తొల్లిటిభంగి నొనర్పరాదు ; ని
న్నేయెడఁ దల్పరాదు; మదికింపుగ నిన్గని పల్కరాదు; నిన్
బాయఁగరాదు దుష్కృతము; భామిని మాటలు వేయు నేటికిన్.

క. సుగుణంబులగని మగనికిఁ
దగుమగువ యటంచు మున్ను దగువారలలోఁ
బొగడొందుచుండి, యిట్టులు
దగనిపనుల్ సేయనీకుఁ దగునే తరుణీ ! ౬౪౪

గీ. హారికటాక్షంబు గలవారి కవనిలోన
భూరిసంసారబంధముల్ పోవునట్లు

హరి కటాక్షంబు నేఁడు నీ కబ్బెఁ గాన
బహులసంసారబంధంబుఁ బాయు నబల ! ౬౮౬

క. సబలారాతివటంచున్
ప్రబలతపశ్శక్తిగంటి పటుమతిచే ని
న్నబలారాతినిగాఁ జే
సి, బహుస్తుతి గాంతు నే నశేషజ్ఞులచేన్. ౬౮౭

వ. అని పలికి కోపోద్రేకంబున. ౬౮౮

క. భాషింపరాని దుస్తర
దోషముఁ జేసితివి; మిఁగుల దుర్మతి వగుటన్
యోషా ! నీ విచ్చోటన్
పాషాణమ వగుచుండుము బహువత్సరముల్. ౬౮౯

చ అని శపియించి, క్రమ్మఱ నహల్యను గాంచి మునీంద్రుఁ డాత్మలోఁ
గనికరమూని, రామ ! విను, కంజహితాన్వయవార్ధిసోముఁ డ
త్యనఘుఁడు రామచంద్రుఁడు దయాత్ముఁడు నిన్గన నేఁగుదెంచు ని
వ్వని కెపు డప్డు శాపము నివారితమౌ తదనుగ్రహంబునన్. ౬౯౦

క. నీలోపల బెగడకు మన
నీలోపలమై యహల్య నేలంబడెఁ ద
త్కాలమున గౌతముఁడు హిమ
శైలాగ్రంబునకుఁ దపము సలుపఁగఁ జనియెన్. ౬౯౧

వ. అంత. ౬౯౨

చ. అమరులపాలికేఁగి, దివిజాధిపుఁ డిట్లను; వేల్పులార ! గౌ
తముఁడు మహోగ్రమౌ తపముఁ దానొనరింపఁగఁ దత్తపంబు నే
నమరహితంబుగాఁ జెఱుప నాత్మఁ దలంచుచు నేఁగి, తన్మనః
కమలము నొంప, నన్విఫలుగా శపియించె మునీంద్రుఁ డల్కచేన్.

గీ. అటుశపించిన నాదర్ప మడఁగె మీరు
విఫలుఁడగు నన్ను సఫలుఁ గావింపుఁ డన్న

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీశ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు. పరిషద్వ్యవస్థాపకాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

కళాప్రపూర్ణ జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు కోశాధ్యక్షు

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

కోరాడ శివనాథశాస్త్రిగారు,

నిడుదవోలు వేంకటరావుగారు, బి. ఏ.

" వెంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

పిళ్ళారిశెట్టి రంగబ్రహ్మేశ్వరరావునాయుడుగారు.

ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్.

## ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీశ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు పిఠాపురము మహారాజావారు. పరిషద్ద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు- ఉయ్యూరు జమీందారువారు.

## ఆంధ్రసాహిత్యపరిషత్కార్యనిర్వాహకసభావర్గము.

### కార్యనిర్వాహకసభాధ్యక్షులు.

కళాప్రపూర్ణ జయంతి రామయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.

### కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ., బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

### కార్యనిర్వాహకసభాసభ్యులు

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు కోశాధ్యక్షులు

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

కోరా శివనాథశాస్త్రిగారు,

నిడుదవోలు వేంకటరావుగారు, బి. ఏ.

అ వెంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

పిళ్ళారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్.